REG. No. 757

శ్రీ

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని. జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు

సంపుటము 6 | 1914 మే | సంచిక 5

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhan
Janapati Pattabhirama Sastry

అభినవసరస్వతీ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు—

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | అళ్ళయాచార్యవిజయము ... ... | రు. | 0 | 4 | 0 |
| 2 | కరిణీకోద్ధారిణి ... ... | | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయము } ఇవి నాటకములు. | | 0 | 4 | 0 |
| 4 | కంసవధము } | | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి ... ... | | 0 | 4 | 0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర ... ... | | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | | 0 | 2 | 0 |
| 8 | వత్సల నీతిశతకము ... ... | | 0 | 1 | 6 |
| 9 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము ... ... | | 0 | 2 | 0 |
| 10 | అత్యద్భుతవిమర్శనము ... ... | | 0 | 5 | 0 |
| 11 | నర్సరావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | | 0 | 3 | 0 |
| 12 | లక్ష్మీవిలాసము ... ... | | 0 | 4 | 0 |
| 13 | చిత్తూరుజిల్లా తీర్పువిమర్శనము ... | | 0 | 4 | 0 |
| 14 | పశ్యాంపుశ్యాం ... ... | | 0 | 2 | 0 |
| 15 | సంగదోషము ... ... | | 0 | 3 | 0 |
| 16 | పశ్యశబ్దవిచారము ... ... | | 0 | 3 | 0 |
| 17 | వీరభాగవతము ... ... | | 1 | 4 | 0 |
| 18 | పుళిందావివాహము ... ... | | 0 | 4 | 0 |
| 19 | గురిగింజ ... ... | | 0 | 1 | 0 |
| 20 | గుంటూరుసీమ, తిరుపతివేంకటీయము ... | | 1 | 0 | 0 |
| 21 | వేమవరాగ్రహారశతావధానము ... | | 0 | 12 | 0 |
| 22 | పిష్టపేషణము ... ... | | 0 | 1 | 0 |
| 23 | వ్యాసనిష్కాసనము ... ... | | 0 | 1 | 0 |

# అభినవసరస్వతి

సంపుట 6. | జానపాడు ఆనంద సం॥ వైశాఖమాసము | సంచిక 5.

## గ్రంథస్వీకారము

1 దొంగస్వామిచరిత్రము, 2 స్త్రీవిద్యాసారసంగ్రహము, 3 శ్రీవేణుగోపాల సీసతారావళి, యను గ్రంథములు మాకార్యస్థానములంకరించినవి. వీనిపై మాయభిప్రాయము ముందుఁ దెలుపఁబడును.



## పంచాననబహ్యాకరణము

(గతసంచిక శేషము)

హితకారిణిలో సుకవిశేఖరి సాహసించి వ్రాసిన కొన్ని పంక్తులు మిక్కిలి దురూహామిళితంబులై యున్నవి. ఇతని వ్రాఁతల కడ్డులేదు. ఇతనికి రానితిట్లులేవు. బ్రహ్మశ్రీ వేంకటశాస్త్రిగారు బందరు హైస్కూలులో, టీచరుపదవిలోనుండఁదగఁడు సరికదా ప్రయిమరీస్కూలులోఁగూడ బోధకుఁడుగ నుండఁదగఁడఁట శౌరా? ఏమి యీతని దుర్మేధ. యేమియీతని యహంకృతి, యేమియీతని పరేంగితవేత్తృత, భాషాపోషకులపైఁకి వృథాగఁ గత్తిగట్టి కాకివలె వాపోవు దుర్విదగ్ధుఁడగు నిమ్మహాత్ముని వెనఁటివ్రాఁతలు శాశ్వతములై భాషాసేవకులగు డింభకుల నీమార్గమునఁ ద్రిప్పనో కొంతకాలమునకు గాకపోయిన మఱికొంతకాలమునకైనఁ మంచిబుద్ధికలుఁగునో గ్రహింపవశము గాకున్నది మఱియు నీతని నోటికిఁ బోలె వ్రాఁతకుఁగూడఁ దలుపుద్వారబంధము లేదు. యుక్తాయుక్తవిచారణజ్ఞానము లేదు. దానికిఫల మిహపరములఁ గట్టికుడుపఁగలదు గాని యీ మధ్యఁగల యీతనిపవిత్రవాక్యరత్నముల నించుక పాఠకులకుఁ జవిచూపవలసియున్నవి. ఇవి విషముష్టిపండ్లో యడవిబీరకాయలో కారుమునగకాయలో యను భ్రాంతి ప్రతివాని కిఁక నేని తోఁచునని మాకొక వెఱ్ఱిధైర్యము గలదు. తిరుపతి వేంకటేశ్వరులకు గవీశ్వరపదము తగదఁట. వీరికి రామకృష్ణులు శతఘ్ని నొనర్చిరఁట. పేరికాశీనాధశాస్త్రి గారేమో చేసిరఁట. శ్రీనివాసాచార్యులు గారెద్దియో జేసిరఁట. బొగ్గరఁపు శ్రీరామశా

స్త్రిగా రేదియో పలాయనముఁజేసిరఁట. రావుగారేదో సమస్యయిచ్చిరఁట. ఇందుచే వీరి కీశ్వరపదము తగదఁట. ఎగదంట, బాపురే.

రామకృష్ణకవులశతఘ్నికి నానురూపములు లేకుండఁజేసి భాష కొక నవీనవ్యాకరణంబుఁగల్పించి పాశుపతముఁ బ్రసరించినది వెఱ్ఱిశాఖాభిమానిగా రెఱుంగరేమో? కాశీనాథశాస్త్రిగారి బండారము బయల్పరచు పూర్వశాకుంతలవిమర్శనమొగము వీరవలోకింపరేమో? శ్రీరామశాస్త్రిగారి పలాయనమునకు స్వస్తిగా నొప్పు పిష్టపేషణము వీరి కర్థముకాలేదేమో? రావుగారికొఱకై యశమునుగరచించిన "పశ్యాం పుశ్యాం" వీరవలోకించియు సార్థకము లేకపోయినదికాఁబోలు. ఆచార్యులవారివిషయము మతాభిమానముచే మేముఁ బ్రాయమానినను బ్రాహ్మలోకకర్ణకుహరంబులకుఁజొచ్చునట్లు నానారాజసందర్శనాదికములు కంచుఢక్కాలతో బాదినట్టుల నివేదించుచున్నవి. తక్కినవారి తెలివి తేటలఁ దెలుపు తక్కినగ్రంథములఁ బేర్కొను టలిచట ననుచితము.

ఇంతమాత్రమునే తిరుపతి వేంకటేశ్వరకవులు పైవారలకోడిరని మనోరంజనియందేమి హితకారిణియందేమి సాహసించి వ్రాయు వికటాత్ముల కన్నఁ జేసి సద్బుద్ధికలుఁగునా? కలుఁగదు. ఒకవేళఁ గలిగి ఫలమేమి- వెళ్ళఁగక్కుకొనవలసిన క్రోధాన్నమంతయు నిదివఱకే బయల్పడినది. ఇఁకఁ బసరో పాడోఁ కలదు. "పూబముగడు దండులోనున్న యింటిలోనున్న నొకటేయనినటుల నిఁకఁ గ్రక్కినగ్రక్కమన్న నొక్కటియె ఇవిఅన్నియు జీవములేని వ్రాతలు. ఐనఁ బ్రత్యుత్తరము పేక్షించుఁగాని జవాబు వ్రాయువారు వ్యాసకర్తలకంటె మూఢులుఁగాదు లోకజ్ఞానశూన్యులని చెప్పిన నిందెట్టియాటంకములుఁ గల్గఁబోవు. ఇఁక వీరుచేయు కృత్యములు వ్రాయు వ్రాఁతలు కోయుసొరకోఁతలు చెప్పినఁతీఱవు. తిరుపతి వేంకటేశ్వరులఁగొనియాడువారు మూఢులఁట. ఇటులనుట కంటె మూఢత వేఱకలదా. "తాఁబట్టినకుందేటికి మూఁడుకాళ్ళను వాదము లోకము స్థిరపఱుప మూలనున్నవారి ముంగిటికిఁ దెచ్చి యఘటనాఘటనపటిష్ఠకవితావిలాసుల దూషించుచుఁ దమవలె దూషింపని వారి పాపములాడు నీయుపవిలేఖరి వ్రాఁతకుఁ దగిన ప్రతిఫలమిదియె-కృష్ణరాయనిం బోలిన విద్వచ్చక్రవర్తి యున్నకాలమైనఁ జేమూరకవిన్న మంచితిమి ఒకవేళ నిది యట్టికాలమెయైన యెచ్చట నోనీలేఖరి నానురూపముల బయలుపఱుపక యుండుగాని జన్మకాలమున శుభనక్షత్రములు శుభముఁజూచుచున్నవి. కావననే యాటలు సాగుచున్నవి. ఔరా!

సీ॥ ఆంధ్రగీర్వాణహూణాదిభాషావేత్తయైన జయంతి రామయ్యగారు
గీర్వాణవిదుఁడు సత్కీర్తనీయుఁడును ప్రోఫెసరా కృష్ణాఖ్యభాసియొకఁడు
శతఘంటకవి ప్రశస్తతరుఁడు కాశికృష్ణాచార్యుఁడనెడి మహామహుండు
కాంచీపురీవాసి కవిమణి లక్ష్మీనృసింహార్యపండితశేఖరుండు
తే. గీ॥ మఱి చతుర్వార్ధ్యవధిరసామండవాయ
మాన సంస్కృతచాతురీజ్ఞాననిధులు
కటకటా మూఢులైరె వెంకటకవీంద్రుఁ
తిరుపతికవీంద్రుఁబొగడి, యొంతిట్టుపోత ?॥

ఆర్యులారా? గుణగణగ్రహణపారీణులారా? మీరందఱు పండితకవులగు తిరుపతి వేంకటేశ్వరుల నంతయో యింతయోఁ పొగడినవారె! విద్వజ్జనదుర్లభమగు మూఢపదము వీరానెత్తినిఁ బిడుగునువిడచినటులఁ బ్రయోగించుమహామహునకు బుద్ధిచెప్పరాదా! అతని నోటి కొకచంద్రహారము వేయరాదా. అతనిపవిత్రతమ లేఖినికి మంచిముత్తియముల గ్రుచ్చరాదే! వినోదము చూచుచున్నారా? అకటా కవితాకన్యా! యీయమోఘుఁడగు సుపవిలేఖునిచే నీకడుపుపండినది. నీజన్మము పావనమైనది. నీప్రతిష్ఠనిలిచినది ఒక నీప్రతిష్ఠయే గాక తి॥వెం॥ కవులను బొగడువారిప్రతిష్ఠగూడ నిలిచినది. నిలువగలదు. నిలుచుచున్నది. నిలిచెను

ఇఱువదివత్సరములనుండి యవ్యాహతముగ నాంధ్రరాజ్యమునంగల కవితాసింహాసమునఁ బట్టభద్రులై యిమ్మహామహులు వెల్గొందుతఱి నీజ్ఞాని దిగ్భ్రమచెందెనో దీర్ఘనిద్రాపరవశుఁడయ్యెనో కాని నేఁటికిమాత్ర మించుక కనులువిప్పి లోకమువారి మేలుకొలుపుచున్నాఁడు. పాపము లోకము తనవలెనే నిద్దురపోవుచుండెనని భ్రాంతిపడెకాఁబోలు. వేయేల, యిప్పటికే "లేవ నోదేవుఁడా!" యని వాపోవు నిమ్మహాత్మ చెవులయొద్దఁ తప్పెటల మ్రోఁత మ్రోగించి కుంభకర్ణు లేపినటుల లేపినది శాఖాభిమానమే కాన వీరితిట్లు చవిచూచుటకున్ను వీరియున్న యభిమానమును దివ్యజ్ఞానము నించుక స్మరింపవలసియున్నది. తెలివిగలమొగములైనఁ దిట్టిపోయక యొకగ్రంథమునను విమర్శము వ్రాసి రామకృష్ణులు పాశుపతముచేఁ బరాభూతులైనట్టులనో యొక బ్రాహ్మణుఁడు తృణీకరణముచేఁ బరాభూతుఁడైనట్టులనో యుప్పుదశకు రానున్న లేకరిగారు కూడ యథాస్థానమునఁ బడవచ్చునే. గ్రంథవిమర్శము! కష్టమని యీతనితలంపుకాఁబోలు. నిజముగాఁ గష్టమే. కష్టమే. ముమ్మాటికిం గష్టమే. దానికిఁ బుట్టకే దైన్య-

వకావలయు" చూచినంతనే మన్యులకు దోషమని భ్రాంతిఁగొల్పు పూర్వకవులప్రయోగములు కంఠస్థములై యుండవలయు. ఇదికాక విమర్శమునకుఁ బ్రత్యుత్తరము పుట్టినపుడు పూర్వపక్షము సేయఁదగ్గ యసమానశక్తి వేఱొకఁ డుండవలయు. ఇవ్వని పండితులు చేయవలసినది. అట్టివారే పూర్వోక్తానుసారముగ నిరువురు పాటుపడి విముఖులైరి. పాపము వారిస్థితినిఁ బ్రత్యక్షముగాఁ జూచియున్నారు గాన సుపవిలేఖరి గారు తెలిసి గోతిలోఁబడలేక యెదుటివారినాగోతిలోఁగూలఁద్రోయుచుఁ దిట్టులపేరి మంటిని రువ్వుచున్నారు. కొంతకొంత వాయువేగమునఁ దమ మొగముననే పడుచున్నది. ప్రత్యర్థులు విసరుచున్నారను భ్రాంతిచే నెడలెఱుంగక శివాలాడుచున్నారు. ఈయన యొక గ్రామ్యుఁడు-పండితలక్షణము గాని విద్యారుచి గాని యెఱుంగని యుత్తమోత్తముఁడు తిట్టుటలో నీతని శక్తి యమోఘమైనది. ఎడమచేయియెత్తి తిట్టినతిట్టు దిట్టక శాపనార్థములఁ బెట్టి బెస్తరాముక్క యెంతదో వ్రాసినమాట వ్రాయక పొల్లుపోకుండఁ దిట్టుటలో నీమతిమంతుఁ డంతవాఁడు. ఇతఁడు నుతినుతి లోకమును దూషించుచున్నాఁడు పలువు రీతనికి మందలింపులఁ గాక్కాలుగ నొసంగి బుద్ధి చెప్పవలసియున్నది. అట్లొనర్పమిమిగుల విచారజనకమగుచున్నది. భాషావృద్ధికై పాటుపడి యేఁబదికంటె నెక్కువ గ్రంథములొనర్చి భాషాసేవకుని కరతలంబులు నిజపుస్తకరాజంబుల నలంకరించుచున్న మహామహుల నజ్ఞానులు దూషించుతఱిఁ బండితులు విద్యాభిమానులు సదయహృదయులు నొనర్పవలసినపని యేది? వినోదము చూచుటయేనా? ఔర కాలస్థితి యేమిమీతివచ్చుచున్నది. రక్తమాంసములు వటించి గ్రంథముల నేఁటికి వ్రాయుచు వ న వంశజాతులచేఁగూడ నభినందింపఁదగిన ప్రతిష్ఠఁగల మహాత్ములపైఁ బలువురొనరించు దురుద్యమములు మాన్పకున్న సుగతిగల్గునా? దీనిచే నిహము పరము గల్గునా! సత్యకాములై దిరిగెడి యభినవసరస్వతీసంపాదకులగు జానపాటిపట్టాభిరామశాస్త్రిగారువలె నకారణముగఁ దిట్లు తినవలసివచ్చునని జడిసితిరా? సదుద్యమమున కనేక కష్టములు గల్గును. హితు లహితులయ్యెదరు, చుట్టములు పగవారయ్యెదరు. అంతమాత్రమునకె మనము భయపడరాదు. దూషకుల నోరులు మూయవలసియున్నది. వంచకులకు బుద్ధిగఱపవలసియున్నది. భాషకు పవిత్రత నొసంగవలసియున్నది. దుండుడుకుల వ్రాఁతలమంటఁగలపవలసియున్నది. మనసునొచ్చి పలువురి యమానుషవాక్కులచే నిసికియున్న కవిసింహుల పరాక్రమమునకు మెఱుగుఁ బెట్టవలసియున్నది. పండితులారా! మనమిటు లూరుకొనుట తగదు. పొంగి పొరలి సత్యకాముల నావరించనున్న ప్రలాపసముద్రము చెలెలికట్ట

నతిక్రమించినది. లోకముపైఁ బడినది. సర్వజనుల దాసులుగనొనర్చుకొన నానావస్థఁ బడుచున్నది. దీనికిఁ బ్రతిక్రియ లేదా! యోజింపరాదా! ఈవిషయమున కనుగుణముగ నొకకొంత కవితత్త్వముఁ దెలుపవలసియున్నది. కవి సర్వజనపూజ్యుఁడు. అతనిజీవితము పవిత్రమైనది. వృత్తి నిరాఘాటమైనది. మనస్సు నిష్కళంకమైనది. కోపిష్ఠియై సముద్రము నింకింపఁగలఁడు. శాంతుఁడై వట్టిమోడునఁ జిగురుఁబెట్టింపఁగలఁడు. అతనిపదరజోలేశముచేఁ బవిత్రమైనస్థలము సువర్ణమొసంగును. అట్టివారిలో సత్తమోత్తముఁడు పండితకవి. కవికుటుంబములోఁ బండితకవి మాననీయుఁడు, అతనికిఁ శబ్దరాజి వశము భాష రాజ్యము. రసజ్ఞులు సేవకులు. భాషాసేవకులముగుకతన మనము సమర్థులమగుకవులకు విధేయులమైయుండి వారికిఁ గొంతస్వాతంత్ర్య మొసంగవలసియున్నది. ఇదికదా కవివృత్తము. సర్వవిధములఁ బూర్వకవులకంటె మిన్నలగు తిరుపతి వేంకటేశ్వరుల నక్షరజ్ఞానశూన్యులు నిందించుట లేటిధర్మము కాన మాననీయులారా! సభలసల్పి పత్రికాధిపతులకు హెచ్చరికలఁబంపి కవిదూషకులవ్రాఁత లంతరింపఁజేయుఁడు. ఇది బహుజనులవలనఁ గావలసినపని. శ్రీతిరుపతి వేంకటకవులవలన మనము రసజ్ఞులమైనకతన కృతజ్ఞతనీవిధమునఁ బ్రచురించుట యుక్తము. తడవు సేయకుఁడు. తరుణము మిగులనీయకుఁడు

మ॥ కవి యెవ్వాఁడొ? రసజ్ఞుఁ డెవ్వఁడొ? నమస్కారార్హుఁ డెవ్వాఁడొ? ధీ
రవరేణ్యుం డెటువంటివాఁడొ తెలియన్ రానట్టి యజ్ఞాన సం
భవులార్యేశ్వర సన్నిధానముల యుక్తాయుక్తచర్చల్ పొన
ర్ప విధించెన్ జలజాతసంభవుఁడు సెబాస్ కాలధర్మస్థితుల్॥

చ॥ పతితులకూటముల్ దలఁచు భామిని యన్యులచెంతఁ దాఁ బతి
వ్రతవలె లేనిపోని నయవాదములాడెడిపోల్కిఁ జేటభా
రతములవ్రాసి లోక మదిరా కనుమూసెడిదుర్విదగ్ధ శూ
రతముఁడటంచుఁ బల్కెదగురా తగు రాజసభాంతరంబులన్॥

ఉ॥ శబ్దముఁ బుట్టువెట్టిదియొ? సాహితిఁ గల్గినవారలెవ్వరో
శాబ్దికులెవ్వరో? సుకవిచందురు లెవ్వరో? యన్న సందియం
బబ్దములబ్దముల్ గురుకులాశ్రమభూముల నేర్వనట్టి యీ
యాబ్దికభోక్తృవిప్రసవయస్కులకేల విరుద్ధవాదనల్॥

చ॥ కలియుగదా రసజ్ఞులు నఖండులు, వారలు పోవనట్టి యీ
పలువతెలుంగునందు జనవచ్చునె? పండితగర్వదుర్విద

గ్ధులు; చని యేటిమేలుకనుగొందురొ? శాఖకె యందురా, "బళే
బళే" యని మెచ్చవచ్చు నటువంటిసదుత్తర మబ్బగల్గినన్॥

ఉ॥ శాఖను నిర్వహించుటకు స్వాంతమునందును గోర్కి యున్న దు
ర్వైఖరు లాచరింపక, వివాదములన్ బొనరింపబోక, యీ
లేఖల వెళ్ళఁబెట్టక చలింపకయుండుటలొప్పుఁగాని, మే
లా? ఖరరోదనంబుల నిలన్ బ్రచురించుట, దాన సేమమే॥

చ॥ ఒకరిని దిట్టినట్టియెడ నుత్తమమైన యశోధనంబు మా
కిఁక సొనగూడునంచు నెవరేనిదలంతురె? యన్య గౌరవిం
పక కనులెఱ్ఱజేయునెడ వానిని నోరువలేనివానిఁగా
సకలజనుల్ వచింపరె? ప్రశస్త సభాస్థలులందు నిస్తులుల్॥

ఉ॥ వాదముఁగల్గినట్టియెడ వారికి వీరికి నైకమత్య సం
పాదనఁజేయ నెమ్మదిని భావనసేయుట లొప్పుగాని హా
బాదముచెట్టుక్రిందఁగల శాపనమైదువురాలి రీతిగా
నేదియొవాగుచుంట హితమే? యది కీర్తిదమై చెలంగునే॥

ఉ॥ కూరిమిగల్గువారలనుగూర్చి నుతించుట కిట్టునీతిలోఁ
జేరనకప్పఁబోలెఁ బరిశీలనసేయక వాఁగినంతనే
సారముగల్గునే? విపులసారసబృందగళన్మరంద సం
స్ఫారవచఃప్రకాశకవి కాంతయశఃకళ లంతరించునే॥

దూపాటి తిరుమలశేషాచార్యులు,
వేంకటరమణాచార్యులు,
సోదరకవులు.





శ్రీమత్పరదేవతాయై నమః.

# యౌవన నిగర్హణము.

కృష్ణరాట్ప్రణీతము.

---

మ॥ జననంబందితిఁ గీర్తికెక్కినసువంశంబాదు రవ్వంత స
జ్జనసాంగత్యముచేతనే తెలుఁగుబాసన్ జ్ఞానమొక్కింత గ
ల్గెను, నన్నింకను స్వైరిణీరమణి పాల్సేయంగఁబోకమ్మ, యౌ
వ్వనమా! సాహసమింతకూడనుసుమా బాగోగులూహింపుమా॥ 1

మ॥ మునుపున్, నేఁడును నాఁడునాఁటికిని రోప్రాబోండ్లస్నేహంబుచే
తన కీడౌనను మాన్యవాక్యమును ఖాతర్ జేయకేరీతి సి
గ్గునులగ్గున్ విడి దాసిఁగోరెదవు, నీక్రూరత్వమేమందు యౌ॥ 2

మ॥ ధనమానమ్ములు గంగకర్పితము, విద్యాబుద్ధులా లోకమం
దున వ్యాపింపవు, దేశదేశములయందున్ బ్రాకు దుష్కీర్తియే
మి నిమిత్తంబునఁ దిర్గుబోతుతనమున్ మేకొందువింకైన యౌ॥ 3

మ॥ కనుమా తిర్పతివేంకటేశ్వరులసద్గ్రంథమ్ములన్ వానిలో
నన వీక్షింపు ప్రబంధమైన శ్రవణానందంబు హా? దాసిదా
ని నపేక్షింపకు, జన్మజన్మములకున్ నీకొక్కదండంబు యౌ॥ 4

మ॥ చనదీబాలఁద్యజించుటంచుఁగడు ప్రోత్సాహంబు గావించి ఖ్యా
తిని నీతిన్ గనఁబోకుమం చనెదు, నీతెంపింతగాఁబోలు, చా
లును, చాలింపుము నీవచస్థితులు, మేల్ లోకంబువీక్షించు, యౌ॥ 5

మ॥ మనలేవా క్షణమైన దీనివిడి? నీమాటల్ విచిత్రంబులే
మనెదోహో! భువి దీనిఁబోలుసతి లేదంచాడెదా! "తావరిం
చినదే రంభ మునింగినట్టిదియొ! కాశీగంగ" అన్నట్లు యహా॥ 6

మ॥ వినుమా నామనవిన్, గటా పరమసాధ్వీరత్నమైనట్టి చ
క్కనిపెండ్లాముఁ బరిత్యజించి, యిదె స్వర్గంబాచు బోధింప ముం
దునకే తెంచితి వెంతదుర్మతమొ, లేదో బుద్ధి రవ్వంత యహా॥ 7

మ॥ "జనుఁడై పుట్టినమీఁద సంతతమహాసౌఖ్యంబపేక్షించుటే
జనుగా, కివ్విధి యొక్క స్వైరిణి భవత్సాంగత్యముర్ గోరఁగా
దని వెన్దీయుట ధర్మమా" యనెదు సౌఖ్యంబిట్టిదా? నీకు?యహా॥8

మ॥ "ధననారీరతిపాపమేయయిన నీదాసీకులంబేల పృ
థ్విని సృష్టించెవిధాత" యంచనుచు సుద్దిన్ జెప్ప నేతెంచినా
వ, "నయంబింకను" నాచరింపకుము, నీపాదాలు సేవింతు, యహా॥ 9

మ॥ జనకుండాది సమస్తబాంధవులు వంశభ్రష్టుఁడీతండటం
చును నిందింపఁగఁ జుట్టపక్కములునన్ శుంఠాయనన్, దేహమె
ల్లను రోగమ్ములనించు అంకుతనమేలా తిగ్గిబోధింతు యహా॥ 10

మ॥ తనకై తానినుగోరుచున్నయది యీతన్వంగి, చేపట్ట కు
న్నను దప్పంచునుజెప్పవచ్చితివి, నిన్నా! చెంపపై ముచ్చెత్తో
డను మర్దించిన పాపమానను జెట్టూటామాటకాకున్నె యహా॥11

మ॥ అనుమానించెద వేల పాపమని పుణ్యంబంచు సౌందర్యపుర్
ఖనియాబాలిక నొక్కదాని రతిసౌఖ్యంబోధినోలార్చుక
న్నను వేజేమియటంచు వాకొనెద, వన్నా! యెంతచిత్రంబెయహా॥

మ॥ జనవాక్యంబును పాటిసేయవు, సతీసాంగత్యముర్ గోర, వీ
వనితారత్నమెలోకమంచనెదు, పాపంబెంచకే అంకుసా

గినఁ బెండ్లేటికి" అన్న రీతిగదె, అగ్గిన్ ద్రోయ కేకీర్తి, యా॥ 13

మ॥ దినముల్ వచ్చినఁజాలుఁగాని వెయినుండిన్ గోర్కెలీడేర్చి యొ
క్కనినింకొక్కఁడెఱుంగకుండఁబనుపంగా నేర్చు, నీజాతిబో
టిని శాంతంబును జొచ్చుటద్ది పులినోటిన్ దూఱుటే కాద, యా॥ 14

మ॥ మనలోమాట, వచింపుమానిజముఁగన్, మానాభిమానమ్ములుం
చు నెయీజాతి, యెఱుంగవా మునువు నీసోకుల్ చాలాయించు చుం
డిన వేళన్, గడుకష్టముల్ పడినగాని బుద్ధిరాదయ్యె యా॥ 15

మ॥ మనయీస్వైరిణిదగ్గరన్ స్వకులదుర్మార్గప్రచారంబులే
దని యెగ్గెత్తివచించెదార, మతిలేదా సుంత? మ్రోయింపనే
ర్తు నగారా వెలకాంత కెప్పుడు సముద్యోగంబు రాదంచు, యా॥ 16

మ॥ పనియేమీ పదిమాటలాడ? దరిఁజేర్పన్ నాకు శ్వానమ్ము మూ
తిని, నిప్పంటిన నంటఁగాల్చుఁ జుఱుకత్తిన్ గట్టిగా కౌఁగిలిం
చిన ప్రాణమ్ములఁ బాపు, పూన్కెమెయిదాసీపొందు కొంపార్పుయా

మ॥ ఘనభూదేవ పురోహితాదుల సమక్షంబందునన్ హవ్యవా
హనుసాక్ష్యంబుగఁ గట్టికొన్న కులచంద్రాస్యన్ విచారాబ్ధిముం
చిన పాపంబది గంగఁగ్రుంకినను గాసిన్ గూర్పకేపోదు, యా॥ 18

మ॥ కనులన్ గానవో, గుర్తెఱుంగవో కోయుక్తంబెట్టిదో, భార్యకం
టెను సర్వాంశములందు హీనయగు దీనిన్ గూడబోకంచు నె
త్తిననోర్వెట్టి వచించుచుంటి, చెడువృత్తిన్ పీడఁగావచ్చు, యా॥ 19

మ॥ అనురాగం బొకరూకతోఁ గలుగు, గాఢాలింగనప్రక్రియల్
గనసౌ రెంగవదానితో, మఱొకరూకన్ జారితేచాలు చుం
బనసౌఖ్యంబులభించు, నట్టిధన భామాసక్తినీకేల? యా॥ 20

మ॥ కోనినఁ వచ్చెడి ముద్దులంతరుచియో కోర్కె! ఛీవిను ప్రాయమ్మా
ననశంకింపను, రెండురూపములగాఢాశ్లేష సౌఖ్యంబదే
మనివర్ణించెదె యిన్నెఱింగి, ధనకాంతాపేక్షమేలౌనె? యమ్మా॥ 21
మ॥ కనలేవే? క్షణసౌఖ్యమాసపడి లోకఖ్యాతికిన్ దప్పి, స
జ్జనసాంగత్యవిహీనతన్ దుదకు మోక్షప్రాప్తియున్ లేకపో
యిన వీక్షింపఁదలంచి చెప్పెదవు నాకీలాటి దుర్బుద్ధి, యమ్మా॥ 22
మ॥ కినుకన్ బూనకు, సత్యమాడెదను, సత్కీర్త్యంకమేదక్క పృ
థ్విని లేదెద్దియు శాశ్వతంబనఁగఁ బాపీ! దాసిఁగాంక్షించి మా
యసి దుష్కీర్తిగడింపఁజూచెదవు దూరాలోచనల్ మాని, యమ్మా॥23
మ॥ అనఘుల్ సత్కవులెందఱో ననుపుకాండ్రై పొందిరే దుర్యశం
బనరాఁబోకుము, యేన్గు దోమయొకటౌనా? వారికిన్ నాకుఁ బో
ల్చినఁ గొండంతటిభేదముండినది, ఛీ ఛీ తొత్తుపాత్రేల, యమ్మా॥ 24
మ॥ నినుబంధింపఁగలారె సన్మనుజులే కాసీ, యింక నేనెంత కా
ననె నిన్నున్ బ్రతిమాలుకొంటి నను నిందల్ పాలుసేయంగఁబో
కని; నీచిత్తము నాదుప్రాప్తి, యిఁకజోహారందు రక్షింపు యమ్మా॥25
మ॥ మనపూర్వుల్ వచియింపరే మొదలెభామన్ నమ్మరాదంచు, దా
సి నసల్ నమ్మఁగఁజెల్లదంచనిరి, ఛీ! సిగ్గేలలేదంచు న
న్ననుపింపంగయతింపఁ గావలదుసుమ్మా! మాటదక్కింపు, యమ్మా ॥
మ॥ ధనమున్నన్ బదదాసియై మెలఁగి, సాంతంబైనతర్వాత మొ
త్తను బాదంబును బెట్టనీయదు, విరుద్ధంబట్టులీనాఁడు దో
చిన యీమాటలు పిమ్మటన్ మనకుమంచిన్ గూర్పఁగాఁజాలుయమ్మా॥
మ॥ మొనమొన్నన్ మన "కండ్లముంగటను" భూముల్ సర్వమున్ బోవకొం
పనుగోడిన్ దెగనమ్మి, భార్యమెడలో మాంగల్యమే విక్రయిం

చినవారెందఱు లేరు జారులయి, దుశ్చింతఁ విసర్జింపు, యథా॥ 28

మ॥ అనృతంబాడను, కిన్క యేటి, కులుకేలా, యున్న మాటన్న? జా
నె "నిజంబాడిన నిష్ఠురంబగును కాదే యెరికిఁ? నేఁటికై
నను సత్యంబు గ్రహించి అంకుతనముఁ వ్యాసంగముల్ మాను, యథా॥

మ॥ ఆనలజ్వాలవలెఁ బవిత్రియగు భార్యఁ బీడి సన్నాసిరో
వనితఁ బాసినఁ జత్తువంచ నెదవ్రా పాపాత్మ నీకర్మమే
మనవచ్చుఁ "పొరుగింటిదన్న రుచికాదా పుల్లకూరైన" యథా॥30

మ॥ అననేలా! సతి చాలరూపవతి యయ్యైనఁ ధనస్త్రీలపై
మనసౌనష్టుల భార్యపైఁగలుగ, దీమాటల్ ధృవంబౌను, కా
వున వేర్ వ్రాతల వేల, దూరవునగంబుల్ నున్నుగాకున్నె, యథా॥

మ॥ పెనుభూత ప్రథమావతారమనఁగాఁ బేర్వెట్టనౌ దాసిదా
నినిమిత్తంబున, తల్లిదండ్రులెఱు లేసిఁ మూటలంగట్టిపె
ట్టిన రో పాడొనరించిమీఱకుము, పాటిఁ బుద్ధి సెప్పింతు, యథా॥32

మ॥ మనబోళ్లెంతతలంప, మున్ను ధనభౌవాదుష్టచేష్టామహా
ధ్బిని విజ్ఞానులెముస్గి నారనఁగ, నివెత్తెయుగుంగాక చు
ల్కనగానే "గుడిమ్రింగువారలకు లింగంబెంత పాపిష్టి యథా॥ 33

మ॥ పిననాఁటఁ వ్యభిచారియై సకలదుర్వీర్యంపు రోగాంబ చే
ననపత్యుండయి చేసికొన్న సతి జాడ్యగ్రస్తఁగావించి "యిం
టనువంటుం" జెడిపోవుకష్టములకన్నఁ బైనవేఱున్నె? యథా॥ 34

మ॥ కనువారెల్ల మొగంబుపైనుమియగాఁ గన్నీరుమున్నీరుగాఁ
జన నిల్లాలు "నలో" యనంగఁ దమలంజల్ గీయుగీలైన దా
టినజారుండొకఁడైన లేఁడనుట రెట్టింతుఁ నిజంబంచు యథా॥ 35

మ॥ ధనమెవ్వాఁడిడువాఁడె భర్తగదవిత్తస్త్రీకి వేవేలొసం
గినఁ గస్సిటదె యింక నెక్కనికినై కిగ్గాడి కన్దోచి నె
ట్టనఁ దా "పుత్త్రెనుపుట్టుబుద్ధితుదిఁ గాటంగాల్పఁగాఁబోవు యశా॥ 36

మ॥ ననుపుంగత్తియకప్పఁదెచ్చి యిడి దానన్ బేదయై త్రాగుబో
తననార్జించికడిందిపేర్చిదప దొంగై యెట్టులో మేపి లం
జను, రో లేమి నిరాకరింపఁబడి బిచ్చంబెత్తుజారుండు యశా॥ 37

మ॥ తనుజారత్వము చేయవద్దని ప్రజల్ దాఁజేయుజారత్వమా
దినమే జ్ఞానియు, నత్తకోడలకు బుద్ధింజెప్పి తాఁజంకుబో
యిన కైలాటపుఁరీతి యీవెఱుఁగు దిస్సీ బుద్ధితోనుండు యశా॥ 38

మ॥ అనుమానింపకు వారువీరు కనినారా సిగ్గుబాల్లంచు నె
వ్వనికంటంబడుదుర్ నిశీథమున రూపాజీవయిల్సేరు వే
ళ నసంగావలదింక అంకుతనమేలా దాగు నంతంత యశా॥ 39

మ॥ తనకున్ బెక్కుఱు తొత్తులుంచుచు జగత్ప్రఖ్యాతిమూలంబటం
చును వీక్షించినదానినెల్ల రమియించుచున్ సల్లమేకైనఁ గ
ల్గినద్రవ్యంబునకున్ ఫలంబిదియె?సత్కీర్త్యాకరంబౌనె?యశా॥ 40

మ॥ చనవేమాత్రమొసంగినన్ సరియె లక్ష్యంబుంచరెవ్వారియుం
దును బోషించెడివారనన్ భయములేదొక్కింత, పైపెచ్చు నా
తనినాడింతురు స్వైరిణుల్ చెవులకున్ దాటాకులంగట్టి యశా॥ 41

మ॥ ధనభామల్ రసికల్ స్వకాంతలన ముగ్ధల్ ప్రౌఢిమల్లేవు కా
వున వేశ్యారతిబల్ సుఖప్రదముగాఁ బ్రోత్సాహముంజేసి ని
ల్వున గొంతేటికిఁగోయఁజూచెదవు సద్బుద్ధిఁ విచారింపు యశా॥ 42

మ॥ అనలజ్వాలల శైత్యముం, బులికహింసారంభముం వేడిచం
ద్రునకుం, గప్పకుఁ గాటు, దుర్జనుల కెందుం గీర్తి భోగాంగనా
జనికిం జారునియందు నిక్కపుఁదముల్ జన్మించునే యెందు? యా॥

మ॥ అనుమానింపరు తంపిపెట్టుటకు భార్యాభర్తలందుం గుమా
రునకుం దండ్రికి నిర్నిమిత్తముగఁ బోరుల్ గూర్పఁగా నేర్తు రే
మని వర్ణింపఁగలాడ స్వైరిణుల దుర్వ్యాపారముల్ చాలు యా॥44

సంపూర్ణము.



శ్లో॥ కదా వా త్వాం దృష్ట్వా గిరిశ! తవ భవ్యాంఘ్రియుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్
సమాశ్లిష్యాఘ్రాయ స్ఫుటజలజగంధాన్ పరిమళా-
నలభ్యాం బ్రహ్మాద్యై ర్ముద మనుభవిష్యామి హృదయే
మ॥ భవదంఘ్రిద్వయి మచ్ఛిరఃకరసుదృగ్వక్షంబులన్ నిల్పి యు
త్సవ మొప్పం దగఁ దత్కుశేశయసుగంధంబాని యంభోజసం
భవశక్రాదులు పొందఁజాలనిమహాభవ్యప్రమోదంబునన్
భవ! నాచిత్తమునందుఁ బొందుచును నే బాగొప్ప నెప్డుందునో 26
శ్లో॥ కరస్థే హేమాద్రౌ గిరిశ! నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజామరసురభి చింతామణిగణే
శిరస్థే శీతాంశౌ చరణయుగళస్థేఖిలశుభే
కిమర్థం దాస్యేహం భవతు భవదర్థం మమ మనః॥
శా॥ పాణిన్ స్వర్ణధరాధరం బతిసమీపంబందు శ్రీదుండు స్వ
స్థానిన్ దేవపలాశిధేనుమణిసంధానంబు శీర్షంబునం
దానీరేజవిరోధి పాదములఁ గల్యాణాంకములుల్లునీ
కే నీయంగలదేది? సాంబశివ! నాహృత్పద్మ మర్పించెదన్ 27
శ్లో॥ సారూప్యం తవ పూజనే శివ! "మహాదే"వేతి సంకీర్తనే
సామీప్యం శివభక్తిధుర్యజనతాసాంగత్యసంభాషణే
సాలోక్యం సచరాచరాత్మకతనుధ్యానే భవానీపతే!
సాయుజ్యం మమ సిద్ధ మత్ర భవతి స్వామిన్! కృతార్థోస్మ్యహం॥
శా॥ శంభూ! తావకభక్తకోటిచెలిమిన్ సాలోక్య మొప్పారె, వి
సంభం బొప్పఁగఁ బూజసల్పి కొనితిన్ సారూప్యవిభ్రాంతి, ని
ర్దంభత్వంబున సల్పు కీర్తనముచేతం గంటి సారూప్య, మా
రంభింప భవన్నుతిన్ గలిగెఁ దోరంబైన సాయుజ్యమున్ 28
శ్లో॥ త్వత్పాదాంబుజమర్చయామి, పరమం త్వాం చింతయామ్యన్వహం
త్వామీశం శరణం వ్రజామి, వచసా త్వామేవ యాచే విభో!

వీక్షాం మేదిశ చాక్షుషీం సకరుణాం దివ్యైశ్చిరం ప్రార్థితాం
శంభో! లోకగురో! మదీయమనస స్సౌఖ్యోపదేశంకురు॥

ఉ॥ నీపదముల్ భజించెదను, నెమ్మదినిన్నె తలంతుసంతతం
బోపరమేశ! నిన్ శరణమొందుదు మూరుకవాక్కుచేత నీ
ప్రాపునెయాచ్న సేతు, సురప్రార్థితమైతగునీదుదివ్యమౌ
చూపిటువెట్టి మన్మనము చొక్కఁగఁజేయుము సౌఖ్యవారిధిన్॥ 29

శ్లో॥ వస్త్రోద్ధూతవిధౌ సహస్రకరతా పుష్పార్చనే విష్ణుతా
గంధే గంధవహాత్మతా న్నపచనే బర్హిర్ముఖాధ్యక్షతా
పాత్రే కాంచనగర్భతా స్తి మయిచే ద్బాలేందుచూడామణే!
శుశ్రూషాంకరవాణి తే పశుపతే! స్వామిన్! త్రిలోకీగురో

ఉ చేలసమర్పణన్ రవిత శ్రీధరతా ప్రసూనప్రపూజలన్
గాలుసుగంధసత్కృతుని గంధవహాత్మత పాత్రదానమం
దోలి నజత్వ మన్నపచనోత్కృతి నింద్రతగల్గెనేనియున్
శ్రీలుసహింప భక్తిమెయిఁజేసెద నీయుపచారమోశివా!॥ 30

శ్లో॥ నాలంవా పరమోపకారకమిదం త్వేకం పశూనాంపతే!
పశ్యన్ కుక్షిగతాన్ చరాచరగణాన్ బాహ్యస్థితాన్ రక్షితుం
సర్వామర్త్యపలాయనౌషధ మతిజ్వాలాకరం భీకరం
నిక్షిప్తం గరళం గళే నగిళితం నోద్గీర్ణమేవ త్వయా॥

శా॥ లోకాసహ్యవిషంబుగాంచి యఖిలుల్ లో భీతిఁజెందంగ బల్
వీకం గుక్షిగ బాహ్యగాఖిలజగద్భీతిం దొలంగించుచున్
నీకంఠాన నెనిల్పి ప్రోచితి సురానీకంబు, లోకంబులో
నీకంటెం బరమోపకారియగువానిం జూడఁబో మీశ్వరా! 31

శ్లో॥ జ్వాలోగ్ర స్సకలామరాతిభయదః క్ష్వేళః కథంవాత్వయా
దృష్టః, కించ కరేధృతః, కరతలే కిం పక్వజంబూఫలం?
జిహ్వాయాంనిహితశ్చ సిద్ధఘుటికా వా? కంఠదేశేభృతః
కింతేనీలమణిర్విభూషణమయం శంభో! మహాత్మన్ వద॥

చ॥ అతిభయకాలకూటశిఖ నానెడివేళఁ గరంబునందు మా
నితగతినుంచఁగా నదియు నేరెడుపండొకో? నాల్కయందు స
మ్మతినివసింపఁజేయ నొకమాత్రయొకో? గళసీమఁజేర్ప నం
చితహారినీలభూషణవిశేషమొ? యిమ్ముజవాబు దీనికిన్ 32

శ్లో॥ నాలంవాసకృదేవదేవ! భవతస్సేవా నతిర్వా నుతిః
పూజావా స్మరణం కథాశ్రవణమప్యాలోకనం మాదృశాం
స్వామిన్నస్థిర దేవతానుసరణాయాసేన కింలభ్యతే
కావాముక్తిరితఃకుతో భవతిచేత్కింప్రార్థనీయం తదా॥

ఉ॥ తావకసేవయో నతియొ త్వత్స్మరణంబొ భవత్ప్రసంగమో
పావనసత్కథాశ్రవణభక్తియొ మాకొకయింతచాలదే?
దేవ! యిఁకెద్దిముక్తి? పరదేవసమాశ్రయణంబునుండి యిం
కివల నేమిపొందవలె? నెయ్యది ప్రార్థనసేయఁదగ్గదా ॥ 33

శ్లో॥ కింబ్రూమ స్తవసాహసం పశుపతే! కస్యాస్తి శంభో! భవ
ద్ధైర్యంచేదృశ, మాత్మనస్స్థితిరియం చాన్యైః కథంలభ్యతే
భ్రశ్యద్దేవగణం త్రసన్మునిగణం నశ్యత్ప్రపంచం లయం
పశ్యన్ నిర్భయ ఏకఏవ విహర త్యానందసాంద్రో భవాన్ ॥

మ॥ హర! నీసాహసమేమనందు,మఱి నీయాత్మస్థితంగాంచ నే
నరుఁడోపున్,స్వపదచ్యుతత్రిదశులం దైన్యాఢ్యులౌభిక్షులన్
దిరమొప్పన్ లయమహాప్రపంచమును బ్రోదిం జూచుచో సాధ్వసం
బరయన్ లేక చరింతువొక్కఁడవె నిత్యానందయుక్తంబుగన్॥ 34

శ్లో॥ యోగక్షేమధురంధరస్య సకలశ్రేయస్కరోద్యోగినో
దృష్టాదృష్టమతోపదేశకృతినో బాహ్యాంతరవ్యాపినః
సర్వజ్ఞస్య దయాకరస్య భవతః కింవేదితవ్యం మయా
శంభో! త్వం పరమాంతరంగ ఇతి మే చిత్తే స్మరామ్యన్వహం॥

శా॥ యోగక్షేమధురంధరత్వ శుభదోద్యోగిత్వము ల్గాంచుచున్
బాగొప్పన్ నిఖిలంబెఱింగి కృపమై బాహ్యాంతరవ్యాపితా

ప్రాగల్భ్యంబున నైహికంబు పరముం బ్రాపించుమార్గంబవీ
వోగోవాహన! కాన నా ప్తునిగని న్నూహింతు స్వాంతంబునన్॥ 35

శ్లో॥ భక్తో భక్తిగుణావృతే ముదమృతాపూర్ణే ప్రసన్నే మనః
కుంభే సాంబ! తవాంఘ్రిపల్లవయుగం సంస్థాప్య సంవిత్ఫలం
సత్వంమంత్ర ముదీరయన్ నిజశరీరాగారశుద్ధిం వహన్
పుణ్యాహం ప్రకటీకరోమి రుచిరం కల్యాణమాపాదయన్॥

శా॥ దేవా! భక్తిగుణావృత ప్రమదవాదీనవ్య త్ప్రసన్నత్వయు
గ్భావాష్టాపదకుంభమందున భవత్పత్పల్లవంబుంచి యా
పై వేడ్కన్ దగ జ్ఞాననామఫలముం బ్రాపింపఁగంజేసి దే
హావాసంబున సత్వమంత్రమునఁ బుణ్యాహంబు గావించెదన్॥ 36

శ్లో॥ ఆమ్నాయాంబుధి మాదరేణ సుమనస్సంఘా స్సముద్యన్మనో
మంథానం దృఢభక్తిరజ్జుసహితంకృత్వా మథిత్వా తతః
సోమం కల్పతరుం సుపర్వసురభిం చింతామణిం ధీమతాం
నిత్యానందసుధాం నిరంతరరమాసౌభాగ్య మాతన్వతే॥

చ॥ సుమనసులెల్లఁ జిత్తమనుసొంపగుకవ్వము భక్తిరజ్జుచే
నమరచి వేదసాగరము నాస్థమెయిన్ మథియించి యందుపై
సముచితకామధేను పృథుసౌఖ్యసుధా మణి కల్ప సోమలా
భమునఁ జెలంగి ముక్తిరమ ప్రాపునుగాంచెద రోమహేశ్వరా!॥ 39

శ్లో॥ ప్రాక్పుణ్యాచలమార్గదర్శితసుధామూర్తిః ప్రసన్న శ్శివః
సోమ స్సద్గణసేవితో మృగధరః పూర్ణ స్తమోమోచకః
చేతఃపుష్కరలక్షితో భవతిచే దానందపాథోనిధిః
ప్రాగల్భ్యేనవిజృంభతే, సుమనసాం వృత్తి స్తదాజాయతే॥

ఉ॥ పూర్వగపుణ్యశైలస్మృతి పూర్ణసుధాంగుఁడు నేణధారియున్
సర్వసదర్చితుండును బ్రసన్నుఁడునున్ శివరూపుఁడున్ దమో
గర్వహుఁడైనసోముఁడు ప్రకాశిల మానసపుష్కరంబునం
దుర్వి ముదబ్ధిపొంగు,నపు డొప్పెడినిన్ సుమనఃప్రవృత్తియున్॥ 38

మ॥ చనిపోలేరమ పాతపాటములకున్ సంప్రోక్షణంబన్న పే
ర నమాంగల్యపుఁగృత్యముల్ సలిపి యూరం దార ప్రఖ్యాతినిన్
గొనఁగంజాలిరి, యంత బోనములనుం గొంపోవగన్ వేళగా
గనరారందుకు ముందుకేన్ ద్విజుల నొక్కండేని, కోమట్లనున్ ॥ 111
చ॥ వరకులజాతులైన యొకబ్రాహ్మణవైశ్యులుదప్ప భక్తిమై
నరిగిరిచాలమంది వృషలాదులొకొక్కరుబోనమూని, మా
కరణముగారు "వత్తు" మని కాఁపుల సంతసపెట్టిపెట్టి కు
మ్మరికిఁ దండులమ్ములొక మానెఁడొ తవ్వెఁడొ వండిపెట్టఁగన్ ॥
క॥ ఈవిధిఁ గమసాలెలచేఁ। గావింపంబడఁబ్రతిష్ఠ గష్టంబయ్యెన్
భూవిబుధులకందఱకున్। బోవిల్గాకుంట శక్తిపూజనమునకున్ ॥ 113
చ॥ తదుపరి నర్సరాట్పురికిఁ దానొకరెండుదినంబులేగుపై
నెదియొస్వకార్యముండిచని యిచ్చటిప్లీడరు చెప్పినట్టి య
య్యది మది నమ్మఁజాలకయ యచ్చటిపెద్దవకీలుమోఁలనే
తుదవఱకున్ మదగ్రజుఁడు తుందుమకంతయు విప్పిచెప్పినన్ ॥ 114
చ॥ "నిజముగనిద్ది పెద్దగునేరమె, మీయథకారిముందరన్
విజయముకాదుమీ, కతఁడు వేలకు వేత్తినను, మీదుశాత్రవ
ప్రజ బలవంతమైనయది, పాఱఁగనై చెద రెన్నియైననున్
గజిబిజియైచనుందుదకుఁ గార్యముమీయది వెంకటప్పయా! ॥ 115
క॥ అందుననే మేమందఱ। మెందేన్ గురిజాలప్రక్క కేగకయూటల్
వందలువదలంగల వరి। బృందమునకు మీరు చార్జిపెట్టినయెడలన్ "॥
*a* సీ॥ విద్వత్కవీణ్ముఖవివిధార్యసన్మాన
కరణసంపాదితఘనయశుండు

---

*a* తిరుపతివెంకటేశ్వరుల గుంటూరుసీమ ఉత్తరరంగము

క॥ ఊరుకీర్తి నరసరాట్పుర। వరవాసుఁడు పంగనామువంశ్యుఁడు సుగుణో
ద్ధురుఁడు నరసింగరావ। ప్పరమునకున్ మమ్మను స్వాయముగఁదాఁ బిలిచెన్ 118

అన్నవస్త్రప్రదానాద్యాదృతానేక
బాడబవిద్యార్థిబాలకులకు
ఇంగ్లీషువారు నెంతే మెచ్చ మాట్లాడు
హూణభాషాప్రౌఢి నెప్పఁజాల
వాదవైదుషి నెంతవ్యవహారమైనను
గెలిపింపఁజాలిన బలువకీలు
గీ॥ పంగనామాల శ్రీ నరసింగరావు
తత్త్వమీరీతినుడువ మద్భ్రాంతియంతఁ
"జూఁత" మనియనుకొంచు స్వచేతమందు
పచ్చెమాగ్రామమున కొకవారమునకు॥ 117

తే॥ వచ్చి ప్లీడరునుడివినవార్తయెల్ల
నాకువినిపించి తా మున్న నేకములగు
వ్యాజ్యములలోనఁ దిరిగినవాఁడగుటను
"బూర్వపుంబగదీర్చికోఁబూనె" ననుచు॥

చ॥ తలఁచి విమర్శకుం డెదిరియొదారికి లాగఁగలాఁడటంచు నా
వలననె చార్జిచర్య జరుపంబడు టుత్తమమన్న భావము
న్దెలుపుటయేవిలంబముగ నేనును దానికిసిద్ధమైతి, నీ
సలిపినయట్టిపాడుపని సహ్యముగామిని నంతరాత్మకున్॥ 118

క॥ ఇరువురముం గురిజాలకు। మఱుదినమున వెళ్లి నచట మాట్లాడుటకే
సరియైనయట్టిప్లీడరు। కఱవై పని సుంత యేని కాకుండుటయున్॥

---

శా॥ "ఊరేగింపొనరించి తెచ్చితిమి మిమ్మో మహాయశా, నేఁడు నిం
పారంబం పెదమల్లె" యంచు నరసింహారావులోనైన యా
ధీరుల్ పల్కఁ దొడంగి రట్లొ యలసద్ధీమంతులన్ మాన్చి కా
ర్యారంభంబునఁజేసి యేగితిమి మే మానాఁడు గుంటూరికిన్॥ 128

ఆ॥ వె॥ జానపాటపూరకుఁ "జార్జినినిం"డంచు
నాదియంద చెప్పి యరిగినతఁడు
లాయరి చిలుకూరు లక్ష్మినారాయణ
దాచెపలివసింపఁ దడయకరిగె॥ 120

క॥ వ్రాయించిసరిగఁజార్జి।యాయన ద్వారమున వెళ్లి యయ్యాదిదాఖల్
చేయఁగనెంచిన రాసిఁ।డాయెనుసధికారియతనినంపెకమునకున్॥ 121

సీ॥ ఏదియోయొకనెపంబిడి త్రోసివేయక
తిన్నగాఁజార్జినిదీసికొనఁడు
హైప్రివేటుప్లీడర్లుపట్టువకాల్తులన్
స్థిరబుద్ధి దాఖలుచేసికొనఁడు
దండిప్లీడరునేని దాలత్ప్యపెట్టక
క్రాసుచేసిననుమల్ వ్రాసికొనఁడు
కోర్టునకరుగెంచు పార్టీలనెల్లరం
బువ్వఁదిట్టక నోరుమూసికొనఁడు
గీ॥ ఇన్నికళలుగలిగియున్న మేజస్ట్రేటు
పల్లెనాటిజనుల భాగ్యగరిమ
రాఁ దటస్థమయి బిరానట్రాన్స్ఫరుగాక
యొక్కనాలుగేడు లుండనయ్యె॥ 122

మ॥ అపుడేయొక్కటి కోర్టులేనిదినమై యందందువెళ్లించి యా
విపరీతాత్మనిదృష్టియందుఁబడఁగన్ "పీల్గాదుహో"మ్మం చెదో
నెపముం బెట్టిమరల్చి నొండహామునన్, నేనంతమర్యాఁడుపో
యిపడన్ ముందర నేదియో వెదకెఁగా యేమందునాదోసమున్॥ 123

క॥ వెదకి యదియేదొ చెప్పఁగ।నదియుదినేదిద్దికొనుచు నాచార్జిన్
దుదకెట్లో పెట్టఁగలిగితి।వదల కతనికన్న మొండివాడనగుటచే॥

చ॥ అదియదియన్నియుంగలిసి యయ్యెనుజార్జియొసంగునాఁటికిన్
బదియయిదుందినంబులిటు, పల్వురెఱింగినకొట్టుతిట్టువం
టిది యిది కాకయుండుటను నిల్కడయయ్యెనుసింత కాలమున్
దూద కిది యొక్క హేతువయి తోడ్పడెమాయధికారిగారికిన్॥ 125

చ॥ అయియయియన్నియుం దుదకు వ్యర్థమయయ్యెనుచార్జి, యేమనన్
స్వాయముగనే విమర్శనముసల్పక యాతఁడు పిడ్గురేలకున్
రయముగఁ జేసెఁదారిఫరు"రమ్మటన్యాయముకల్గకున్న నే
న యిదివిమర్శచేతు"ననినాదగుకన్నులనీళ్లు తుడ్చుచున్॥ 126

ఉ॥ పోయితినంత నేమగునొ పూన్కియటంచును, పిడ్గురాళ్లలో
నాయకుఁగప్డు స్టేసనున నాయఁడుగారొకరుండఁ గమ్మవా
నాయన లేగిపిల్చుటయు న్యాయము తేల్చుట కేగుదెంచెఁదా
నాయనగారు, ప్రప్రథమ మయ్యెనుగోష్ఠియొకండువారికిన్॥ 127

క॥ కృపలేక తఱిగికోళ్ళన్
గపటాత్మత మెసవి త్రావి కల్లున్ సారాయ్
త్రపవిడిమాయుర్కమ్మలు
కుపథమునందిరుగుచుండ్రుగోష్ఠియటంచున్॥

క॥ ఆగోష్ఠులకనుకూలురు। రాగనె యాహూతిసలిపి రయమునదమకున్
లోఁగొనియెద రెంతటియు। ద్యోగినినేన్ న్యాయమెట్టులుం డెడినింకన్॥

ఉ॥ కేసువిమర్శకుంగడఁగి క్రిందికివీఁడికిఁ జేసి స్టేషనా
ఫీసరుగారుపోవుటయుఁ బెట్టితినేను బిటీషనొండు"పీ
ర్పాసిరిన్యాయమార్గమును గ్రమ్మఱ సొంతగ వీఁగ్విమర్శకున్
దీసికొనుం"డటంచుఁ బయిధీగునకున్ మదిఁ దత్తరంబునన్॥ 130

తే॥ ఆపిటీషనుజూచి ధర్మాధికారి
యప్పుడిడి ఫైలులో "నింకదప్పు"దనుచు

ముందుగా న్యాయపక్షమే పూని కేసు
చాలవఱకువిచారించి చార్జిచేసె 131

క॥ "పండితుఁడవిప్ర, నీసరి
దండిమగల్ లేరుచూడఁ దక్షులలో"నం
చొండొక స్తోత్రముచేయుచు
నుండంగన్ మొదలుపెట్టె నెక్కొ-క్క-మొదల్ 132

క॥ నాదియు బ్రాహ్మణవర్ణమే
మేదేల్ దేల్పంగవలయు నిందె"యటంచున్
నాదగుపక్షముఁబూనిన
మాదిరిమాట్లాడె మధ్యమధ్యను నాతో(న్) 133

చ॥ ఇదిసకలంబు ముద్దయిలకెక్కు-వభీతిజనించి యేగియో
కుదురుచుకోఁ బ్రయత్నపడుకోసముగాని కనంగ నాదుపై
నొదవుకృపావిశేషమయియుండదు, వంచకులిట్లు లేకదా
మెదలుట లోకమందుఁ దమమిత్రతఁజూపుచుఁ గొన్నిఘస్రముల్

ఉ॥ ముద్దయిలందఱుం దమది మూర్ఖత సుంతయుఁ గాదటంచు మే
మద్దెసనుంశిరూడఁ దమయాఁపసికిష్టులమైతిమంచు నీ
విద్దె కలాదులున్ సలుప వేమఱుచూచుచునుంటిమంచుఁ దా
మెద్దియొ చెప్పికొంచు నపు డిందుకుఁదెచ్చిరి కొంతసాక్ష్యమున్ 135

క॥ కమసాలెలుకొందఱు సా। క్ష్యము చెప్పిరి వారికద్ది క్రమముగుఁగా క
క్రమముగవచ్చిరికొందఱు। కమసాలెలపక్షమూనిగ్రామశిముఖ్యుల్

చ॥ ధరణిసురుండుతానగుచుఁ దక్షకవర్ణజు లప్పిటిష్టులన్
జరుపుటకున్ సహాయమును జాలనొనర్చినయట్టిప్రౌఢు మా
కరణముగారి ముద్దయినిగానటఁజేర్చుట యుక్తమైనను
బొరపడువిడ్చితిం దుదకు బోనముదాఁ గొనిపోఁడటన్నధీ(న్) 137

చ॥ విడిచిననాకుఁ బాచితము వెంటనెచేసె, నదెద్దియంచనన్
నడివడిసాక్ష్యమున్ నుడువవచ్చెను బంధులఁగూడి "నీకునీ
నడవడికూడ"దంచును ఘనంబుగ నెందఱుబోధచేసినన్
విడువఁడు తానుబట్టిన వినింద్యపుఁబట్టుదలన్ మనంబునన్ 138

క॥ "మునిసీభున్ ముద్దయిగా
నొనరించితిరీరు కాననొప్పితి సాక్ష్యం
బున"కనుచును నేమేమో
యనుకూలతనన్నుఁగూర్చి యతఁడువచించెన్ 139

ఉ॥ ఇద్దఱిదొక్క గ్రామమయి యెవ్వియొవైరములుంటఁ జేసి యీ
కొద్దిపనింబొనర్చుటకుఁ గోర్టునకెక్కెను నీతఁడిట్టులన్
బెద్దమనుష్యుఁ డుత్తముఁడు వేత్తయుఁ దంగెడ వీరయాహ్వయుం
డద్దిర సాక్ష్యముంబలుక నాయనకున్ మనసెట్టులొప్పెనో 140

ఉ॥ ఉత్తరసాక్ష్యమందుఁ దమకున్నయపాండితిఁజూపి యెవ్వియో
బత్తులు వాదమల్సలుప "బాగుగలేదిది"యంచు నెంతయో
మొత్తుకొనంగనే నపుడు మోసముచేసెను "గోర్టుపక్షమై
ఐత్తురు ప్రాజ్ఞులొక్క"రనిపల్మఱు నాయధికారిచెప్పుచున్ 141

క॥ శ్రీనాభివంశపంకజ। భానుండగు రామమూర్తిపంతులుగారిన్
నేనందుఁ గోరసాక్ష్యము।"నొనధికవ్యయముకోర్టు"కనియుడిగించెన్

తే॥ అందుపైనేను దాడెపల్యంజనేయ
శాస్త్రిగారినిగోరిన సమ్మతింపఁ
కెవరొపత్తురువత్తురం చెన్నొదినము
లచటఁ బడవేసియుంచె మ మ్మకటయతఁడు 143

ఉ॥ బాగుగనేర్చి హూణకలఁ బండితులై సురభాష నున్నతో
ద్యోగముసేయుచుండిన మహాన్నతులేయరుదేర సాక్షులై

సాఁగదు స్వప్రతాపమని సాకు నెదో కలిపించి వారిదౌ
యోఁగమునంబు నొప్పకయ యాతఁడు దుష్ప్రథమున్ విధించెఁగా 144

చ॥ గడపఁగనేమొ చెప్పఁదును గాలము నీవిధి ముద్దయిల్ భయం
పడి పదిమందిగూడి పలుపాట్లకు లోనయి వర్తమానముల్
నడిపిరి యయ్యగారికిఁ, గనంబడె నెద్దియొ లాభ, మందుపై
విడుదలచేసనందతని వేగమ కేసును గొట్టివేయుచున్ 145

ఉ॥ "మీకరణాలె చేసిరిసుమీ యిటు బ్రాహ్మణులయ్యుఁ బాము, నే
నేకరణిన్ విధింతునిఁక సయ్యది నీకుహితంబుగాను, కై
కోకిదియాత్మలోన సివిలుకోర్టున సాగిసఁ గల్గు న్యాయ"మం
చాకులపాటునన్ మరలనాద్భృతిచూపియె పంపెనాపయిన్ 146

---

a ముద్దయిలు
I. వోలేటి లక్ష్మయ్య
II నందిగాము కాశీపతి
III. సిరిపురపు భిక్షాపతి
IV. నందిగాము చినబ్రహ్మయ్య
V. జుజ్జూరి మల్లయ్య
VI. వున్నము చినవీరయ్య
VII. వున్నం చంద్రయ్య
VIII. బొర్గవరపు శేషయ్య
IX. కాటూరు నారాయుడు
X కూరపాటి ల చ్చన్న

ఫిర్యాదితరఫు సాక్షులు.
1. జానపాటి పట్టాభిరామశాస్త్రి
2. ముదిగొండ భద్రయ్య
3. జానపాటి రామయ్య
4. జానపాటి అచ్యుత రామయ్య
5. నందా నరసింహము
6. రాంపల్లి మహాదేవశాస్త్రి
7. పట్టెల వీరాస్వామి

ముద్దయితరఫు సాక్షులు.
1. జానపాటి రంగయ్య
2. జానపాటి జానికి రామయ్య
3. ఏలూరు సర్వయ్య
4. వెల్లటూరు శేషావధానులు
5. సిరికొండ దశరథయ్య
6. తంగెడ వీరయ్య
7. వంటల వెంకయ్య

ఆ॥ *a* యాజనాధికారమగసాలె జాతికిఁ
“గలదు లేద”టంచుఁ గట్టిచేయఁ
గాద యిది మదీయకార్యంబు కావునఁ
దద్విమర్శ చేయఁ దలఁపలేదు” 147

క॥ అని యేమొవ్రాసి వెంటనె। కనఁబఱచెందనను తెలివికమసాలెలకీ
పనియందర్హతకల”దని।“యనిరెవరో సాక్షు”లనుచు,హా యేమందున్

తే॥ చాలచోట్లఁ బ్రతిష్ఠలన్ సలిపిరంట
కాని మాదినపాటిలోఁ గరణమయ్య
యొకఁడు తేలెను సాక్షియై యుర్విపైకి
నదిశిలాంకురమయ్యె ధర్మాధిపతికి॥ 149

ఉ॥ *b* మాదినపాటబ్రాహ్మణులు మాదిప్రతిష్ఠను మెచ్చికొంచుఁదా
మా దెసకేగి బోనములనర్పణజేసిరటన్న దెంతయున్
గాదునిజంబు,వీరయయు గ్రామణితమ్ముఁడు సీతయాఖ్యచే
బాధితుఁడై యటుల్ పలికెఁ బాపము బంధుజనప్రియంబుగన్ ।150

---

*a* పై కేసుయొక్క తీర్పు. ఇంగ్లీషుకు సరియైన తెనుఁగు

(15) సివిల్ కోర్టుయొక్క యధికారములోవుండు పార్టీలహక్కును స్థిరపరచుటయ నునది యీకోర్టువారివిధి కాదు, కావున నాయంశమును విచారించఁదలఁపలేదు.

(17) 4-5-6-7 ముద్దయితరఫుసాక్షులవల్లఁ గమసాలెలు ప్రతిష్ఠలుచేయుటకర్హులని యుఁ జాలగ్రామములలోను దాచెపల్లిమాదినపాడు గ్రామములలోను జేయించిర నియుఁ దెలియవచ్చుచున్నది. అందులో మాదినపాడుగ్రామములోఁ గొలదికాలములో జరిగినట్లు తెలియుచున్నది.

*b* తంగెడ వీరయ్య సాక్ష్యము.

ఇప్పటికి 10 సంవత్సరాలక్రిందట నాగ్రామములోవుండే మాదెమ్మదేవతను నా గ్రామములోని యావత్తుమంది పెద్దఅగ్రహారంకాపరస్తుడయిన వకవిశ్వబ్రాహ్మణివల్ల ప్రతిష్ఠచేయించినారు సదరుదేవతకు బ్రాహ్మణులు బోనముయిస్తారు......బ్రాహ్మణులుకూడా విశ్వబ్రాహ్మణులవల్ల ప్రతిష్ఠచేయుటకు యిష్టపడినారు......ప్రతిష్ఠకాలమందు బ్రాహ్మణులుకూడా వచ్చియుండిరి...జానపాడుకరణం రంగయ్య నాకు బంధువుకాడు......

సీ॥ ఘనసువర్ణరత్న ప్రకరములిచ్చెను జన
స్తోత్రములైనట్టి సన్మిత్రులకును
వరకిరీటములిచ్చె గురుతరోద్భటబల
వంతులైనట్టి సామంతులకును
ధవళాతపత్రముల్ తగనిచ్చె సత్కృపా
సింధువులైనట్టి బాంధవులకు
పట్టాంశుకములిచ్చెఁ బతిభక్తిసంతతా
త్స్వాంతలైనయువంటి కాంతలకును
స్వర్ణశైలతులాపురుషస్థిరాన్న
తిలమహీధరధవళాశ్వరథహస్తి
రజతలింగాదిదానముల్ రమ్యలీల
నిచ్చె భాసురులైన మహీసురులకు 138

క॥ నరపతి పండ్రెండవనాఁ
డరముఁగఁ బుణ్యాహ మొనరఁగ సలిపె సుతునకున్
వరజన్మవేళజనులకు
సరవిన్ సుఖమిచ్చుకతన శంతనుఁడనియున్ 139

వ॥ ఇత్తెఱంగున నాభూమండలాఖండలుండు నిజకుమారరత్నంబునకు జాతకర్మ నామకరణాన్నప్రాశన చౌలోపనయనాదులు క్రమక్రమంబునఁ గావించి యనంతరం బక్షరాభ్యాసంబు మొదలుగ ఛందోగణితకావ్యనాటకాలంకార వేదశాస్త్రపురాణేతిహాసప్రకారంబు లెఱింగించి మాతంగతురంగశతాంగారోహణ ప్రవీణత్వంబును బ్రాసకుంతతోమర పరశుపట్టిసభిండివాలశూలగదాంకుశప్రముఖ వివిధాయుధాభ్యాసంబు గావించునంత శైశవం బతిక్రమించి,

తే॥ సకలబాంధవలోచనోత్సవకరంబు
కామినీజనసంమోహకారణంబు
వైరిజనచక్రచక్రాంగవర్షసమయ
మలరె నృపతికి నవయౌవనాగమంబు 140

సీ॥ అకలంకనవయౌవనాదభ్రసుకుమార
సుందరాంగస్ఫూర్తిఁ జెందుటకును
సకలకాలములందుఁ బ్రకటితాఖండదృ
ష్టాంతమై భవలీల నలరుటకును
వృద్ధిక్షయవికార విరహితసంపూర్ణ
లలితవిలాసంబు గలుగుటకును
మహితవిశ్వంభరా మండలీమృదుపాద
కమలవిన్యాసంబు గాంచుటకును
మరుఁడు కుసుమాకరుఁడు సుధాకరుఁడు వేల్పు
రాకొమరుఁ డేకమూర్త్యభిరాములౌచుఁ
గలగుణవిశేషములు గన్నగతిని నృపకు
మారుఁ డొప్పారె మోహనాకారుఁడగుచు 141

చ॥ సరసకలాఢ్యుఁడౌ నృపతి చంద్రుని నిద్దపుఁజెక్కులందు సుం
దరముగ నంకురించు చిఱునవ్వు తనర్చుఁ దదీయసన్మనో
హర రసనాంచలస్థలవిహార నిరర్గళ దివ్యభారతీ
సరసిజనేత్రి ముగ్ధ తెలిచాయలు కోపుల గ్రమ్మినట్లుగా 142

తే॥ తరుణులకు వాని సరససౌందర్యరేఖ
వీక్షణము చేయ సాత్వికావేశ మొదవు
శ్రీవరాంశోదితుండగు నృపతిగన్న
సాత్వికావేశమాట నైజంబకాదె 143

ఉ॥ కాయజసుందరుం నృపశిఖామణిఁ దప్పకచూచి ముగ్ధలేఁ
బ్రాయపుజవ్వనుల్ విరహభారపరిశ్రమభిన్నచిత్తలై
తీయక వెచ్చనూర్చుచును దీనతచే "నపచారమెద్ది, మే
మాయతదండనార్హుల" మటందురు ప్రార్థనమీఱఁ దత్సతుల్

క॥ అరినారీజనములకు। గురుసంభ్రమకరములగుచుఁ గువలయపతి భా
సురభుజవదనాంబుజములు। కరమలరెం జంద్రహాసకలనాఢ్యములై ॥

క॥ రాజును దినరాజుగ దిన। రాజును రాజుగ సదంతరసమయములఁ ద

ద్రోజమణిశీత్రవశౌర్య! భ్రాజత్కీర్తులొగి మాఱుపలచుం దరుచై
తే॥ వాని వితరణసంతతిగాన లేక
శాఖియొప్పారె సంతానసంజ్ఞచేఁ ద
దర్థమై తలఁపోంది చింతామణిప్ర
సిద్ధనామము సురమణి చెందియొప్పె॥ 147

వ॥ అనినవిని "తదనంతరకథావిధానం బెఱింగింపు"మనుటయు.

చ॥ అనుపమచక్రశుక్రశలభాయితశాత్రవగోత్ర! గోత్రభృ
ద్ఘనబలశర్మనిర్మితశతక్రతుచోదితవారిదోదితా
శనిశకులీకులీరకదృషత్పృషదార్తిగఘోషభామినీ
జనవరగోత్ర! గోత్రతనుజాతనుజాతవినూతనార్చితా! ॥ 148

క॥ గౌరీనారీడితగుణ! హరి! దూరీకృతాఖిలాంహోభారీ!
శౌరీ! మారీచారీ! హరీ! శ్రీవెంకటాచలాగ్రవిహారీ!॥

తరల॥ వనచరద్విజరాజపోషణవైభవోన్నతదండకా
వనచరద్విజరాజభూషణవంశతోగ్రపరాక్రమా!
వనచరద్విజరాజభీషణమైనతేయమహోజ్జ్వల
ద్వనచరద్విజరాజదూషణధర్మబద్ధవివాహనా! 149

గద్య

ఇది శ్రీవెంకటేశ్వరకరుణాకటాక్షసంప్రాప్తకవిత్వవిద్యావిచి
త్రాపస్తంబసూత్ర హరితసగోత్రపవిత్ర వెంకటనరస
యామాత్యపుత్రాన్నమరాజాన్వయపయఃపా
రావారసంపూర్ణపూర్ణిమాసుధాకరస
కలగుణరత్నరత్నాకర విద్వజ్జన
విధేయ రమణయనామధేయ
ప్రణీతంబైన
శంతనురాజ
చరిత్రంబను
మహాప్రబంధంబునందుఁ ప్రథమాశ్వాసము.

# శంతనురాజచరిత్ర

—:o:—

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీపదలమేలుమంగా। శ్యామాసంకుమదపంకసంకలితోద్య
త్కోమలకుచకలశశిఖ। రామాల్యాభరణ వెంకటాచలరమణా!॥ 2

వ॥ అవధరింపుము జనమేజయవసుంధరారమణునకు వైశంపాయనుం డిట్లని చెప్పందొడంగె.

—హిమవదృతువర్ణనము—

ఉ॥ అంత ననంతవైభవమహాద్భుతలీల ధరిత్రిఁ దోఁచె హే
మంతము సన్నశాంతఘనమానవతీకుచకుంభసంభ్రమ
త్క్రాంత మశాంతదంతురితకంతులతాంతశరచ్ఛిదాధ్వగ
స్వాంత మతాంతకైరవనిశాంతరణత్ప్రియదాళికాంతమై 3

ఉ॥ నిత్యజగత్త్రయీవిజయనిష్ఠురశాసనశంబరాంతకో
ద్ధత్యమునన్ బగల్ సురతంత్రవిలాసములొందఁగోరు నా
సత్యవతీపరాశరుల సాంద్రమనోరథసిద్ధి కెద్ది యౌ
చిత్యగతిం దనర్చె ధరఁ జిత్రత నత్తుహినంబు రాజిలెన్ 4

మ॥ సకలస్థావరజంగమంబులకు లో సంస్థాయియైనట్టి త్ర్యం
బకు జామాతగఁ గాంచితింగడఁకఁ దద్బాహ్యస్థలవ్యాపకా
త్యకలంకస్థితి నాకుఁజెల్లునని సీతాహార్యమూర్ధన్యము
త్సుకత న్నిండిన రీతి మించు దనరెన్ సూచీముఖాభేద్యమై 5

తే॥ మహితవిస్ఫూర్తిమీఱ హేమంతసమయ
మాంత్రికుం డుత్తరానిలమంత్రమునను
శీతభూతంబు తగఁ బంపుఁజేయ నార్తి
జడియుకైవడి లోకంబు వడఁకఁ జొచ్చె 6

క॥ పాండురహిమసంఘాతము। నిండినతద్వాసరముల నీరేరుహాజా
తాండంబులవీక్షింపఁగ। వెండికరండములరీతి విలసిల్లెఁ దగన్ 7
క॥ హిమబిందుకందళాశ్రయ। సుమనోగుచ్ఛములు మిగులఁజూపట్టె రతి
శ్రమజనిత ఘర్మకణభృ। త్కమలముఖీలసదురోజ కలశాభములై
తే॥ సాంద్రశశ్వదవశ్యాయసలిలబిందు
కందళంబులు దశదిశల్ గప్పుకొనఁగ
నగములెల్లను దేవతానగములయ్యె
నగములెల్లను ఖర్జూరనగములయ్యె 9
క॥ సరసస్థితిఁ బద్మిని యిన। కరసంగతిఁజెందకున్న గాసిలదె ధరన్
సరస్థితిఁ బద్మిని యిన। కరసంగతిఁజెందకున్న గాసిపడదొకో 10
సీ॥ మృగనాభికాపంక మిళితకాలాగరు
చందనగంధ చర్చావిధముల
సలలితోష్ణాన్న భక్ష్యవ్రాతశాక స
ద్యోఘృతప్రముఖ సద్భోజనముల
జాతీఫలమనోజ్ఞ సౌరభ్యరాగ ర
సస్ఫురతాంబూల చర్వణముల
నవమోహనాంగ సుందరలతాంగీవృత్త
శృంగారకుచభరాశ్లేషములను
తే॥ చండనిర్ధూమభీమ జాజ్వల్యమాన
ఘనతరపటిష్ఠనిష్ఠు రాంగార తార
విలసితహసంతికానూన వీక్షణముల
భోగులకు నింపొనర్చె శీతాగమంబు॥ 11
వ॥ ఆసమయంబున, 12
శా॥ ఖద్యోతాహ్వయ మర్త్యకీటమణులం గాఢస్థితిం జెంది నై
జద్యోతాంతరమైనలీలఁ దన కాశాదేశరాజాళి కు
ద్యద్వ్యక్తిం దగ నామమాత్రము సమంబై చెల్లఁగా నిస్తులా
భేద్యస్ఫూర్తిఁ బ్రదీప్రుఁ డేలె నిఖిలోర్వీమండలం బయ్యెడన్॥ 13

—ప్రదీపుఁడు గంగాస్నానమునకుఁ బోవుట—

వ॥ ఒక్కదినంబునఁ బ్రభాతంబున మేల్కాంచి గంగాప్రవాహావగాహనోత్సాహియై చని కృతస్నానుండై శరచ్చంద్రధవళవస్త్రధారణుండై చంద్రికాసాంద్రధవళశీతలసైకతప్రదేశంబున, 14

సీ॥ మానితనియమ సమారూఢవైఖరి
చెలఁగి పద్మాసనాసీనుఁడగుచు
దేహంబు వక్రసంస్థితి మీఱ నొందించి
కమనీయలీల మొగంబు వంచి
నాసాగ్రదృష్టి విన్యాసంబు గావించి
మానసవృత్తులు మట్టుపఱచి
లాలితాక్షసరంబు కేల నారెఁ ద్రిప్పు
చెలమిమంత్రజపాను కలితుఁడగుచు
స్వప్రకాశోరునారాయణప్రశస్త
శబ్దవాచ్యస్వయంభూత జగదఖండ
నిరుపమానందసంపూర్ణ నిత్యసత్య
సిద్ధవస్తువు ధ్యానంబు సేయుచుండె 15

గంగ నరకన్యయగుట

వ॥ ఇట్లు చేయుచుండ, 16

సీ॥ జగములు మోహింపఁ జరియించు మన్మథ
సరస మోహన మంత్రశక్తియనఁగ
స్థిరసంపదవహించిధరణిస్థలంబున మెలఁగెడి క్రొక్కారుమెఱుఁగనంగ
జిత్రలీల లెసంగ జీవకళల్ పూనిక్షితిమించు చిత్తరు ప్రతిమయనఁగ
నవయువసౌభాగ్య హారిమూర్తిధరించి
రహినొప్పు శృంగారరసమనంగ

హావభావవిలాసంబు లచ్చుపడఁగ
భూరి నవ యౌవనాంగ దీప్తులు చెలంగ
నొఱపుగల దివ్యమహిమంబు లుజ్జగించి
గంగ నరకన్యకాకృతి గాంచె నపుడు 17

సీ॥ కటిచరణంబులై కనుపట్టఁగాఁబోలుఁ
బులినంబులును శోణనలినములును
భుజకుంతలంబులై పొలుపొందఁబోలు మృ
ణాళముల్ మత్తహిందోళములును
నేత్రకుచంబులై నిలువఁబో లండజా
నీకంబులును జక్రవాకములును
బ్రపదరోమాళులై భాసిల్లఁబో లూర్మి
జాలముల్ రుచిర శైవాలములును
గాక యుండిన నాకొమ్మ కటితటాంఘ్రి
బాహుకచవీక్షణస్తనప్రపదరోమ
రాజి సౌభాగ్యములు నరరాజనాగ
యక్షకిన్నర రాజకన్యలకుఁ గలదె 18

క॥ భంబులుమదబంభరశిం।భంబులునఖరములుకురులుపటురంభాస్తం
భంబులును త్రిద్విపకుం।భంబులుపద్మాక్షితొడలుపాలిండ్లహహా 19

ఆ॥ నీరజాయతాక్షి నెమ్మోము కడు సంభ్ర
మించు మించుమించుమించుమించు
శారదేందువదన చక్కనిగళము సు
దరము దరముదరముదరముదరము 20

తే॥ బాలపాలిండ్లు చక్కని పైఁడిగిండ్లు
చెలువనూగారు నల్లని చీమబారు
తెఱవననుమోవి తీయని తేనెబావి
పొలఁతిమైతావి కమ్మకప్పురపు దీవి 21

ఆ॥ కనకనగము నెంచుఁ గాలాహి నదలించు
వీణె నెంచుఁ దమ్మివిరుల నెంచు

సౌర సారశారదాబ్జ బింబానన
శ్రోణి వేణి వాణి పాణియుగము 22

క॥ ఇటువంటిభువనమోహనపటుతరలావణ్యవిభవభాసితయా న
కుటిలాలకసఖులై యుత్కటముగ నిరువంకలందుఁదరుణులుగొలువన్

ఉ॥ అందెలుఘల్లుఘల్లుమన నభ్రపువేణి పిఱుందుమీఁదటన్
జిందులుద్రొక్క నిబ్బరపుసిబ్బెపుటుబ్బులగుబ్బదోయితో
నందపుదీవిమధ్యము సియాడఁగఁ బయ్యెదకొంగు దూఁగఁగా
నిందునిభాస్యవచ్చె ధరణీశ్వరుఁడున్న సమీపభూమికిన్॥ 24

గంగ రాజును వర్ణించుట.

వ॥ ఇత్తెఱంగునఁ జనుదెంచి గంగాకురంగేక్షణ రాజపుండ్రేక్షుకోదండు సరసతారుణ్యలావణ్యగాంభీర్యచాతుర్యవిశేషంబులకు నత్యాశ్చర్యధుర్యయై యవ్వసుంధరామండలేశ్వరుని నిజాక్షీణవీక్షణామృతధారాసారంబున నభిషిక్తుం జేయుచు నొక్కవయస్యావతంసంబున కిట్లనియె, 25

శా॥ కాంతా!గన్గొనవమ్మ లీలమెయి భూకాంతుండొ రాకానిశా
కాంతుండో రతికాంతుండో యలశచీకాంతాత్మజాతుండొ యే
కాంతోద్వృత్తి స్వరభక్తి నిల్చె నితఁడుం గౌఁగింట లేకుండినన్
గాంతారాంతరచంద్రికావిభవము ల్గావే సతీసౌఖ్యముల్ 26

క॥ నరసురవిద్యాధర కిన్నరఖగగంధర్వయక్ష నాగకుమారో
త్కరముల గన్గొనినను సత్పురుషునితో సాటిసేయఁ బోసఁగునె చెలియా

చ॥ చిటుకలకొల్కి!యీపురుషసింహుని నేఁ గనుగొన్నమాత్రనే
చిలుకజరాగుఱ్ఱానిపయిఁ జివ్వన హుమ్మని చౌకళించి బ
ల్కలువపరంగురాహుతు హాళాహళిగాఁ జెలరేఁగ యార్చుచున్
దలిరుకటారిఁబూని బెడిదమ్ముగ రొమ్మునఁ గ్రుమ్మఁజొచ్చెనే 28

ఆ॥ కుందరదన!చూడ మొందు నీకామిని
కాము మోము గోము సోము నోము
ఇందువదన!కంటివేవీసియమృతంపు
దీపికావిమోవి తావిదీవి 29

## ఈనెల సొమ్ము చెల్లించిన చందాదారులు.

1 ఉలుగుండం రంగారావుగారు, జిల్లాకోర్టువకీలు, గుంటూరు.
2 బుర్రా పార్వతీశంగారు, ఓవరుసియ్యరు, నర్సారావుపేట.
3 పొతకమూరి విన్నయ్యగారు. ... ...
4 కొండుభొట్ల గోపాలకృష్ణయ్యగారు, వకీలు. ... ...
5 అంగర వెంకట్రావుగారు. ... ... ... ...
6 మల్లాది పున్నయ్యగారు, రివిన్యూయినస్పెక్టరు, సంతమాగులూరు.
7 గొల్లపూడి నరసింహారావుగారు, నిడుమానూరు.
8 లంకా వెంకటనారాయణగారు, పందిటిపాలెం.
9 వేలమూరి వేంకటసుబ్బారావుగారు, డిస్ట్రిక్టుమునసబ్
పెద్దాపురము.
10 పాకాల జగన్నాథముగారు, మల్లాయపాలెం.
11 సుసర్ల రామశేషయ్యగారు, బ్రాహ్మణకోడూరు.
12 గుర్రం వీరారెడ్డిగారు, పిల్లుట్ల.
13 పుతుంబాక సీతారామయ్యగారు, పెదపాలెం.
14 రాజా మానూరు వేంకటగోపాలరావుబహద్దరు, జమీందారు
గారు, సత్తెనపల్లి.



బ్రహ్మశ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతకవిచే రచియింపఁబడిన గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 | బుద్ధిమతీవిలాసము. | 0—12—0 |
| 2 | సత్యహరిశ్చంద్రీయము | 1—0—0 |
| 3 | సాత్రాజితీయము. | 0—14—0 |
| 4 | శివానందలహరి క్యాలికోబైండు (సంస్కృతమునకు గద్యపద్యాత్మకము) | —12—0 |

## ప్రధానపోషకులు

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు.

2 శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహదరు
జమీందారుగారు, గంపలగూడెం

## పోషకులు.

1 శ్రీ రాజా నారయప్పారావు సింహాద్య్రిప్పారావు బహదరు
జమీందారులు, నూజవీడు.

2 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

3 రామసింగుగారు నెల్లుట్ల షాపురపు సంస్థానము మానేజరు నెల్లుట్ల

4 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు

5 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు మక్తాదారు చోల్లేరు

6 బీరకాయలరామారావు దేశముఖుగారు రాయగిరి

## సహాయులు.

1 అన్నమురాజు సుబ్బారావుగారు నండూరు

2 నండూరు నరసింహారావుగారు, కరణం, నండూరు.

3 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి

4 మెదకు శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి.

5 పరాంకుశరావు దేశముఖుగారు యాడారం

6 కుప్పా శంకరశాస్త్రిగారు, చిపలూరు.

7 గంభీరరావు దేశాయిగారు, లింగన్నపేట.

8 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద.

9 కొండపల్లి అనంతరామయ్యగారు, వకీలు. జానగాం.

10 పిరాట్ల సీతాకాంతముగారు, చింతపల్లి.

11 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.

12 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

13 వెన్నూరు రామంగారావు దేశపాండ్యాగారు, పెదవీడు.

14 వాసిరెడ్డి వెత్తయ్యగారు చేబ్రోలు.

15 వెలుగూరి పిచ్చయ్యగారు, కొడముగుండ్ల.

16 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.

17 గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు, వాల్కార్టుబ్రదర్సు, ఏజంటు
నర్సారావుపేట.

18 దెందుకూరి బ్రహ్మాందీక్షితులుగారు గుంటూరు.